# వైశ్యప్రబోధని

తెలుగు మాస పత్రిక





జూన్ 1995

శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి దేవి








With the best compliments from

✆ : Offi : 20993
20744
Resi : 20538
Fact : 20655

# REVATHI PULVERISERS

Manufacturers of :
INSECTICIDES AND PESTICIDES

**Factory :**
**DUPADU ( R.S.)**
Kurnool - Bangalore Road,
Kurnool ( Tq.) Kurnool Dist.

**REGISTERED OFFICE :**
40/353, Gandhi Nagar,
KURNOOL (A.P.)

FOR
Quality and top branded
Insecticides and Pesticides
Remember
**REVATHI**
to Increase your harvest
with the best qualities
AND
Best Quality of Barytes
other Minerals.

V.P.- A1

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైదరాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్థాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రికులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడీ విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు



MR
BRAND

DOUBLE REFINED SUNFLOWER OIL



MR
బ్రాండ్
డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

MADHU REFINARY PRIVATE LIMITED
GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.
✆ : 31, 64, 74.

✆ : Offi : 231, 264, 398, 399. Resi : 274.
MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.
Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం | స్థాపితం : 1961 | బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 52262 ప్రకాశం జిల్లా. ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కావర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణా నదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**
**1969**



**సంపుటి**
**26**



**సంచిక**
**10**



**జూన్ - 1995**



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
విద్యామందిర్
తూర్పు భాగం
కడప - 516 002


సంపాదకీయం

## 'వాట్' ఆమోద యోగ్యం కాదు

పరిపాలకులెవ్వరూ స్వయంగా సమస్యలు సృష్టించు కోరు. ఉన్న సమస్యలను సౌమనస్యంగా పరిష్కారం అయ్యేది ఎట్లా అనే ఆలోచిస్తారు. ముఖ్యమంత్రి యన్టీఆర్‌ది ఇందుకు పూర్తి విరుద్ధం ఆయనకు తన పరిపాలనలోని రాష్ట్ర ప్రజల్లో ఏదో ఒక వర్గము, ఏదో ఒక సమస్యతో సతమవుతూ ఉంటేనే తమాషా

చిలికి చిలికి గాలివాన కానున్న ఇప్పటి 'వాట్' సమస్యే ఇందుకు ఉదాహరణ. యన్టీఆర్ స్వయంగా కల్పించు కొన్న సమస్య ఇది ఒక నాడు యన్టీఆర్ బాహాటంగా తన వ్యతిరేకతను ప్రకటించిన సమస్య కూడ ఇది ఒకనాడు తప్పుగా, ప్రమాదకరంగా, వర్తక లోకంలో గుబులు పుట్టించేదిగా కన్పించిన అదే సమస్యే ఇప్పుడు యన్టీఆర్‌కు ఒప్పుగా, ప్రమాద రహితంగా కన్పించడమే ఆశ్చర్యం

విజయభాస్కర రెడ్డి గారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు, టర్నోవర్ ట్యాక్సు స్థానంలో - రాజా చెల్లయ్య నివేదిక ప్రాతిపదికగా - వాట్‌ను ప్రవేశ పెట్టారు ఇప్పటి వలెనే అప్పుడూ - రాష్ట్రములోని యావత్తు వర్తక సంఘాలూ, వాట్‌ను వ్యతిరేకించాయి. ఉద్యమాలను నడిపాయి. సదస్సులను నిర్వహించాయి. ప్రభుత్వానికి తుది గడువును నిర్ణయించాయి. చివరకు భాస్కరరెడ్డి గారు ఆ ప్రతిపాదనను ఉపసంహరించుకొని వర్తకుల కోర్కెలను మన్నించారు వారికి గౌరవం చేకూర్చారు

అప్పట్లో, వాట్ ప్రతిపాదన వల్ల వర్తకులకు కలిగే ఇబ్బందులూ - అధికారుల వేధింపులూ ఒక్కసారిగా - యన్టీఆర్ ఎదుట ప్రత్యక్షమయ్యాయి. అప్పటి ఆయన

సుతిమెత్తని హృదయం తట్టుకోలేక పోయింది కళ్ళు ధారాపాతంగా వర్షించాయి అందుకే కాబోలు, వర్తక సంఘాలు 'వాట్'కు వ్యతిరేకంగా సాగించిన ఉద్యమాలకూ, ప్రకటించిన నిరసనకూ, నిర్వహించిన సదస్సులకూ యన్టీఆర్, ఆయన పక్షం సభ్యులూ ముందు నిలిచారు ఉద్యమాలను నడిపించారు. "వాట్‌ను ఉపసంహరించు కొంటున్నాం" అని విజయభాస్కర రెడ్డి గారు ప్రకటించగానే యన్టీఆర్ ఆనందాన్ని పొందారు అంతగా, ఆయన్ను ఆనాడు కదిలించిన ఆ సమస్యే తనకు అధికారం లభించి గద్దెనెక్కగానే బహు మంచిదిగా కన్పిస్తూ ఉంది ఉన్న విడ్డూరం అంతా ఇందులోనే

సమస్యలో మార్పు లేదు మార్పు వచ్చిందల్లా యన్టీఆర్ లోనే కాకపోతే అప్పటి చూపులు అధికారమూ, బాధ్యతలకు దూరంగా ఉన్నప్పటివి ఇప్పటివి, అవి రెండూ నెత్తిపైన పడ్డప్పటివి

టర్నోవర్ పన్ను విధింపు - ఆ తరువాత, ఆ పన్ను స్థానములో వాట్‌ను ప్రవేశ పెట్టడమూ జరిపిన ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వము తమను అధికంగా భాధిస్తూంది అనీ ముందు ముందు మరెంతగా భాధిస్తుందో అనీ భావించి, ఆలోచించి, యన్టీఆర్ ముఖ్యమంత్రిగా గద్దెను ఎక్కడానికి వర్తకులూ తమ వంతు సహాయాన్ని అందించారు యన్టీఆర్ వస్తే తమ సమస్యలకు శాశ్వత పరిష్కారం ఉంటుందనీ - ఏ అధికారికీ భయపడకుండా తమ వృత్తిని వీలైనంత ధర్మంగా నిర్వర్తించ వచ్చుననీ భావించడం వల్లనే యన్టీఆర్‌కు వర్తకులు తమ సహాయ, సహకారాలను అందించారు

వాట్‌ను ప్రవేశ పెట్టడం వల్లా, ఇప్పుడు అమలులో ఉన్న 1956 ఆం.ప్ర. సాధారణ అమ్మకం పన్ను చట్టములోని 13సి నిబంధనను సవరించడం వల్లా వర్తకులు యన్టీఆర్‌పై పెట్టుకొన్న ఆశలకు నీళ్ళు వదలి, ఏరుదాటి తెప్ప కాల్చిన వారుగా యన్టీఆర్‌ను భావిస్తున్నారు. తిరిగి తమ వ్యతిరేకతను ప్రకటించారు. ఈ నెల 6, 7, 8వ తేదీలలో రాష్ట్రములోని ప్రధాన పట్టణాలలో ట్రేడ్ బందును నిర్వహించారు అయినా ఈ సంపాదకీయం వ్రాసే సమయానికి యన్టీఆర్ చలించలేదు తన నిర్ణయానికి తిరుగు లేదు అన్నట్లుగానే వ్యవహరించారు.

వాట్ రాష్ట్రములో ఒక వస్తువుపై జరుగు అమ్మకంపై ప్రతి దశలో విధించబడే (మల్టీ పాయింట్) పన్ను కాదనీ, ఒకే సారి విధింపబడే (సింగిల్ పాయింట్) పన్ను అని యన్టీఆర్ పదే పదే చెప్పడం ఒక రకంగా ప్రజలను మభ్య పెట్టడమే. వాస్తవము మాత్రం కాదు

రాష్ట్రములో జరుగు వస్తు విక్రయంపై అన్ని దశల్లో విధింపబడే పన్ను 'వాట్' అయితే, ఆ విధింపు అమ్మకం జరుగు ప్రతి దశలో గల విలువ తేడా పైన్నే జరుగుతుంది. కాకపోతే ఈ వాట్ కేవలం పందొమ్మిది రకాల వస్తువులకు మాత్రమే పరిమితం ఇదే వాట్‌లోని ప్రత్యేకత

వాట్ వల్ల వర్తకులకు అధికారుల నుండీ ఎటువంటి వేధింపులూ ఉండవు అనే ముఖ్యమంత్రి మాట కూడ సత్య దూరమే ఎందుకంటే ఈ వాట్ విధింపు వల్ల వర్తకులకు అధికారుల వేధింపులూ, సాధింపులూ ఎక్కువే అవుతాయే కానీ తగ్గవు

అభివృద్ధి చెందిన పలు దేశాల్లో ఈ వాట్ విధానం ఉంది. అది మహా భేషుగ్గా ఉంది. అనేవి కూడ యన్టీఆర్ పలుకులే అభివృద్ధి చెందిన దేశాలతో మన రాష్ట్రాన్ని పోల్చు కోవడం సమంజసం కాదు అక్కడి ప్రభుత్వం అధికారుల వైఖరికీ, మన రాష్ట్ర ప్రభుత్వ అధికారుల వైఖరికీ పూర్తి విరుద్ధం ఏదో ఒక విధంగా తప్పును చూపించి, వర్తకులను వేధించి, బాధించే మనస్తత్వం కలవారే మన రాష్ట్ర అమ్మకం పన్ను శాఖాధికారుల్లో ఎక్కువ. ఎన్నో ఆధారాలు చూపి, తాను పన్నును చెల్లించ వలసిన అవసరం లేదని వర్తకులు ఎంత చెప్పుకొన్నా తాను అడిగినంతా సమర్పించు కోకుంటే, 'అసెస్‌మెంట్ ఆర్డరు' ఇచ్చి 'అప్పీలుకు పో' అనేదే మన అమ్మకం పన్ను శాఖోద్యోగులు నిత్యమూ చేస్తున్న పని.

వాట్‌ను తిరిగి ప్రవేశ పెట్టడం ద్వారానే కాక, ఇప్పుడు రాష్ట్రములో ఉన్న అమ్మకం పన్ను వ్యవస్థను మరింత సులభతరం చేస్తా మంటూనే మరింత జటిలతరం చేసిన విధానం వర్తక లోకం తమ విషయములో యన్టీఆర్‌ను ఏరుదాటి తెప్పను కాల్చినట్లుగా భావించడానికి కారణం.

రాష్ట్ర అభివృద్ధికి అవసరమగు ఆదాయాన్ని సమకూర్చుకొనుటకు ప్రయత్నించడములో తప్పు లేదు. ఏడిపించైనా, వేధించైనా ఆ ఆదాయాన్ని సమకూర్చు కోవాలను కోవడం నూటికి నూరు పాళ్ళు తప్పు అటువంటి పాలకుల వైఖరి ఇప్పుడు కాకపోయినా, ఎప్పుడో ఒకప్పుడు ప్రజల ఆగ్రహానికి గురికాక తప్పదు.

సమస్య సామనస్యంతోనే పరిష్కార సాధ్యం. మొండితనం, పట్టుదలతో వ్యవహరించడంవల్ల తీరదు. ఈ సత్యాన్ని ముఖ్యమంత్రిగా యన్టీఆర్ తక్షణం గుర్తిస్తారని, వర్తకుల కోరికలను సత్వరం మన్నిస్తారని ఆశిస్తాం .

పరిచయం

# ఇల్లూరు శంకరయ్య గుప్త



కల్మషంలేని చిత్తముతో-కటువు లేని మాటలతో-లోనున్నదానిని బట్టబయలు' చేసి - తనదంటూ ఒక శైలిని ఏర్పరచు కొన్న నిరాడంబరులు శ్రీ శంకరయ్య గుప్త గారు. ఇటు స్వకుల సంఘాలైన వైశ్య సంఘాలకూ, అటు, ఆయన ఎంతగానో విశ్వాసముంచుకొన్న కాంగ్రెస్ పార్టీకీ గుప్త గారు చేసిన సేవలు 'బేరీజు'కు అందనివి. అయినా, గుప్త గారి నిర్మల కృషికీ, చిత్త శుద్ధితో చేసిన సేవలకూ - అటు వైశ్య సంఘాలూ - ఇటు కాంగ్రెస్ పార్టీ తగినంత గుర్తింపునూ - ప్రోత్సాహాన్ని ఇవ్వక పోవడమే విశేషము. ఈ మధ్య ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ ప్రధాన కార్యదర్శిత్వాన్ని పొందిన వారితో పోల్చుకుంటే శంకరయ్య గారు వారికి ఏ విధంగా తీసిపోరు అందులో కొందఱితో పోల్చుకుంటే గుప్త గారే మిన్న. అయితే ధనబలము - రాజకీయము - బెదిరించడములో గుప్త గారు మరీ చిన్న. గుప్త గారి కృషి గానీ, సేవలు గానీ మహాసభ నాయకుల గుర్తింపుకూ - ప్రోత్సాహానికీ నోచుకోక పోవడములోనే ఉంది వింత, విచిత్రమూ

చాలా మంది దృష్టిలో శంకరయ్య పిచ్చి శంకరయ్య. చిన్నగా చక్కిలిగిలి పెట్టే చాలు ఎంత ఎత్తైనా ఎగురుతాడు. ఎంత పనైనా చేస్తాడు వేళ, పాల, కూడు, నీరు ఆయనకు అనవసరం. పదవిని ఇచ్చినా, యివ్వకపోయినా, తనకు అప్పగించిన పనిని చేస్తారు ఆ కర్తవ్య నిర్వహణను చూచిన నాయకులు 'బలే, బలే'గా గుప్త గారిని మెచ్చుకొంటూరు. ఇటువంటి వారి దృష్టిలోనే శంకరయ్య గారు పిచ్చివారు ఈ 'బలే, బలే'లు కానీ, కర్తవ్య నిర్వహణా దక్షత కానీ పదవుల వద్దకు వచ్చే సరికి ఆగి పోతాయి కార్యకర్తలు పనిచేసే దానికే కదా పుట్టింది? అలాంటప్పుడు పదవులకు వీరు అర్హులు ఏలా అవుతారు? అనేది కదా మన మహాసభ నాయకుల ధృఢ నిశ్చయం. ఈ పచ్చి నిజాన్ని కార్యకర్తలు గుర్తించేటంత వరకూ వారి ఈ నిర్ణయానికి 'ఢోకా' ఉండదులే.

'గుప్త' గారు అంటే ఇల్లూరు శంకరయ్య గుప్త గారు. 1938వ సంవత్సరము జూన్ 3వ తేదీన, అనంతపురం జిల్లా గుత్తి తాలూకాకు చెందిన 'లక్షుంపల్లె' అను శివారు గ్రామంలో వీరు జన్మించారు. వీరి తల్లిదండ్రులకు వీరే జ్యేష్ఠపుత్రులు అందు వల్ల కుటుంబ బాధ్యతలను నెత్తిన వేసుకోక

తప్పని పరిస్థితుల్లో 14 సంవత్సరాల వయసులోనే చదువుకు 'గుడ్‌బై' చెప్పి, కుటుంబ భాధ్యతలను స్వీకరించారు. స్వకుల వృత్తియైన వ్యాపారాన్ని చేపట్టి ఆనాటికి వారి కున్న వ్యవసాయ భూములను పండించుకొంటూ, ఉండంగా - ఇంతలో 19 ఏండ్లు నిండడం- వివాహం కావడం జరిగింది. ఆ తరువాత తన వ్యాపారానికి ఆనాటి తాలూకా కేంద్రాలలో ఒకటైన గుత్తి పట్టణాన్ని కేంద్రంగా చేసుకొని తన జీవితాన్ని మరింత ముందుకు సాగించారు. తుదకు అక్కడే స్థిరపడ్డారు.

మజరా గ్రామంగా ఉన్న స్వగ్రామం 'లక్షుంపల్లె' పంచాయితీ గ్రామం కావడానికి గుప్త గారి కృషే ప్రధానం. అందుకు ఆ గ్రామ ప్రజలు ఇప్పటికీ గుప్త గారి కృషిని ప్రశంసిస్తూనే ఉన్నారు. లక్షుంపల్లెకు అతి సమీప గ్రామం భీముని పల్లె. 1961 ప్రాంతములో ఆ గ్రామం కక్షలూ, కార్పణ్యాలతో అట్టుడికి నట్టుడికి పోయేది. ఆనాటి ప్రముఖ గాంధేయవాది స్వర్గీయ కె.చిన్నారెడ్డి గారి కోరిక మేరకు గుప్త గారు ఆ గ్రామంలోని తగాదాలను రూపుమాపే పనిని చేపట్టారు. 1962 నాటికి గుప్త గారు తన లక్ష్యాన్ని సాధించారు. అందుకు అవసరమగు సుప్రీం కోర్టు తీర్పును పొందేందుకుగాను గుప్త గారికి ఇరవై ఒక్క రోజులు ఢిల్లీలోనే ఉండాలసి వచ్చింది.

1957లో గుప్త గారు కాంగ్రెస్ పార్టీ ప్రాథమిక సభ్యత్వాన్ని స్వీకరించారు. అప్పటి నుండీ ఇప్పటి వరకూ అదే పార్టీలోనే కొనసాగు చున్నారు. ఇంత వరకూ జరిగిన సాధారణ ఎన్నికలన్నింటిలోనూ ఆ నియోజక వర్గ కాంగ్రెస్ అభ్యర్థిని గెలిపించుటకు సర్వ శక్తులతో, చిత్త శుద్ధితో కృషి చేశారు. ఒకటి రెండు సందర్భాలలో తప్ప మిగతా అన్ని సందర్భాలలో గుప్త గారు 'సపోర్టు' చేసిన అభ్యర్థే విజయలక్ష్మిని గ్రహించారు వీరి సపోర్టుతో సునాయాసంగా గెలుపొందిన కాంగ్రెస్ అభ్యర్థులలో 1978లో జరిగిన శాసన సభ ఎన్నికల్లో గెలుపొందిన శ్రీ వెంకట రామయ్య గారూ ఒకరు.

బహు కాలంగా తాను చేసిన ప్రజా సేవ మీది అకుంఠిత విశ్వాసముతో గుత్తి పంచాయితీ సమితి అధ్యక్ష పదవికి గుప్త గారు పోటీ చేశారు. అతి స్వల్ప తేడాతో ఆ పదవిని అధిష్టించలేక పోయారు.

ఇంతగా సామాజిక సేవలు చేస్తున్నా గుప్త గారు వైశ్య సంఘాలను విస్మరించ లేదు. గ్రామ స్థాయి నుండీ పట్టణ స్థాయి వరకూ వివిధ దశల్లో జరుగు వివిధ రకాలైన వైశ్య సమాజాభివృద్ధి కృషిలో సంపూర్ణంగా పాలుపంచు కొంటూ ఉన్నారు. వీటిలో 1969 నుండీ గుప్త గారు చేసిన వైశ్య సంఘ సేవ ప్రత్యేకంగా చెప్పుకో దగ్గది. సరిగ్గా అదే సమయములోనే వైశ్య ప్రబోధిని ప్రారంభమైంది. వైశ్య ప్రబోధిని పత్రిక గుప్త గారి లోని స్వసంఘ సేవానురక్తి మరింతగా పెరిగి, పూలు పూసి కాయలు కాసేందుకు మంచి స్ఫూర్తి నిస్తూంది. వైశ్య ప్రబోధిని ఇచ్చిన స్ఫూర్తితోనూ - ప్రచారము

తోనూ స్వసంఘ సేవానురక్తినే కాక వైశ్య సంఘాలలో ఉన్నతపదవులను అధిష్టించిన వారు కూడ ఈనాటికీ వైశ్యుల్లో పెక్కురు ఉన్నారు. అయితే వారు ఈ నిజాన్ని బయట చెప్పుకోరు. గుప్త గారు ఇందుకు వ్యతిరేకము. తన లో యీ సేవానురక్తి పెరగడంలో వైశ్య ప్రబోధిని ఇచ్చిన స్ఫూర్తి, సంపాదకులుగా సోదరులు లక్ష్మీకాంతం గారు ఇచ్చిన ప్రోత్సాహములే కారణాలని చెప్పుకొని గుప్త గారు పొంగిపోచూ తనలోని సంస్కారాన్ని బయట పెట్టుంటూరు.

గుప్త గారి కృషినీ, దక్షతనూ, శ్రద్ధనూ,

యువజన సంఘాల సమాఖ్య, స్వయంగా తనకు కార్యదర్శిగా వరించింది ఆ తరువాత గుప్త గారిని గుర్తించిన మరో రాష్ట్ర సంస్థ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్. గుప్త గారీ సమాఖ్యకు కూడ కార్యదర్శులే. ఇక గుప్త గారు ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అభివృద్ధికి సాగించిన కృషీ - సేవ కూడ విలువ కట్టుటకు వీలు కానంతటివి. అయితే - గుప్త గారు దీనికి బాధపడరు. ఎందుకంటే, మహాసభలో ఉన్నత పదవులు పొందుటకు ప్రధానమైంది సేవ, స్వచ్ఛమైన కృషే కాదనీ - వాటి నధిష్టించుటకు కావలసిన అర్హతలు ధనబలమూ - అనీ - రాజకీయాలు - ఎదురు తిరుగడము అనీ తెలుసుకొన్నవారు కనుక, పదవికై తను ఏర్పరచుకొన్న నైతిక హద్దులను చెరుపు కొనేటంతటి స్వార్థ పరులు కారు గుప్త గారు. "స్వసంఘాభివృద్ధికి జరిగే మహా యజ్ఞములో ఒక సమిధిగా మిగిలినా చాలులే" అన్నదే గుప్త గారికి తృప్తి.

వైశ్య సంఘాభివృద్ధే కాక - వర్తక సంఘాల అభివృద్ధిని కూడ గురిగా పెట్టుకొని, గుప్త గారు వైశ్య ప్రబోధినిలో ఎన్నో ప్రయోజనాత్మకమైన వ్యాసాలు వ్రాశారు. నిర్మాణాత్మకమైన సూచనలూ చేశారు.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారు గుప్త గారి సహధర్మ చారిణి. భర్త మనసెఱిగి ప్రవర్తించుట లోనూ - అతిధి అభ్యాగతులను సత్కరించుటలోనూ ఆమెకు ఆమే సాటి.

సద్భావనతో చేసే కృషి కానీ, సేవ కానీ తప్పక సత్ఫలితాలను ఇస్తుంది అనేది గుప్త గారి మనో ధైర్యము. ఈ ధైర్యము తోనే ఆయన, అప్పుడూ - ఇప్పుడూ ముందుకు సాగుచున్నారు. ఇక ముందు కూడ తన కృషిని సాగిస్తారు.

## వివాహం

కడప జిల్లా ప్రొద్దుటూరు వైశ్య ప్రముఖులు శ్రీ కుమ్మిత్తి సత్యనారాయణ శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ ఇందిరామణి, యం. కాం., గారి వివాహం, ముదిగుబ్బ శ్రీ క్రిష్ణం సుబ్రమణ్యం గారి కుమారులు చి॥ నాగేంద్ర ప్రసాద్ గారితో 5-5-95వ తేదీన ప్రొద్దుటూరు లోని శ్రీ దేవరశెట్టి వెంకటపతి శ్రేష్ఠి కల్యాణ మంటపంలో వైభవంగా జరిగింది.

# నేను, నాదేశం

(గత సంచిక తరువాయి)

## రష్యాపై హిట్లరు దాడి; కాంగ్రెసు నాయకుల కలలు

పై విధంగా విడదీసి రెండు ప్రదేశాలలో వుంచే ముందుగా హిట్లరు సోవియట్ రష్యామీద దండెత్తాడు. కమ్యూనిస్టులలో చాల కలవరం పుట్టింది. వారు విచార గ్రస్తులయ్యారు. కొందరు కాంగ్రెసు నాయకులు సంతోషాన్ని ప్రదర్శించారు. "రష్యా ఓడిపోతుంది; తప్పదని ప్రచారం సాగించారు. ఇన్ని రోజులలో, యిన్ని గంటలలో మాస్కో నగరాన్ని హిట్లరు పట్టుకుంటాడని కమ్యూనిస్టుల చెవుల్లో పడేలాగా శ్రీ కాళేశ్వరరావుగారు గట్టిగా మాట్లాడేవారు.

"లండను, బెర్లిను, మాస్కోలు-ఏవి నాశనమైతే నాకేం? ప్రపంచానికి ఢిల్లీ ముఖ్య పట్టణం కావాలి" అని ఒక నాయకాగ్రణి తన దివ్యమైన దేశభక్తిని వెల్లడించారు.

"కాకసస్ కొండలు దాటాక, సరాసరి మన దేశానికి వస్తాడు; పెషావరు చేరగానే ముఖ్య రాజకీయపార్టీ అయిన కాంగ్రెసు నాయకులను పిలిపించి హిట్లరు "ఆంగ్లేయులకు మాకూ విరోధాలున్నాయి. మీకు ఎల్లప్పుడు సంఖ్య వుంటూవచ్చింది, ఇకమీదట కూడ వుంటుంది. ఇంగ్లీషు వారిని మీదేశాన్నుండి పారద్రోలాము. ఇక మీదేశాన్ని మీరుసుఖంగా పరిపాలించుకోండి అని కాంగ్రెసు పార్టీతో సంధి చేసుకొని వెళ్ళిపోతాడని" బహిరంగంగా కాంగ్రెసు వారు చర్చించేవారు. కాంగ్రెసులో ఎవరైనా సంశయంగా మాట్లాడితే "ఎందుకండీ మీకీ సంశయం? మరో విధంగా జరగటానికి ఎలా సాధ్యపడుతుందో చెప్పండి?" అని దబాయించేవారు.

కాంగ్రెసువాదుల, కమ్యూనిస్టుల మధ్య చర్చ జరిగినప్పుడు శ్రీ కాళేశ్వరరావుగారు "ఇది ప్రపంచయుద్ధం కావచ్చు; ఇందులో రెండు పార్టీలు మాత్రమే వుండవచ్చు. కాని ఇండియాకు సంబంధించినంత వరకూ మన శత్రువు బ్రిటన్ శత్రువులైన జర్మనీ, జపాను, ఇటలీలు మన మిత్రులు. బ్రిటనుతో కలసిపోయిన అమెరికా, రష్యాలు ఇండియాకు శత్రువులే" నని ఖండితంగా, తేటతెల్లగా చెప్పారు. కాంగ్రెసు వారందరికీ యీ విశదీకరణ నచ్చింది. అయితే కమ్యూనిస్టులకు నచ్చలేదు. "మరి చైనా గతి ఏమి"టని, "గాంధీ నెహ్రూలతో ఏకీభవించరా?" అని మరి కొందరు ఆక్షేపిస్తూ మాట్లాడారు. కాని, కాళేశ్వరరావు గారికి అవి ఎంతమాత్రం అడ్డురాలేదు. "ఈ పుక్కిటి పురాణాలన్నీ కట్టిపెట్టండి" అన్నారు.

ఫాసిస్టుల జయం కోరడంతోను, సోషలిస్టు రష్యా ఎంత త్వరగా, ఎంత

సులభంగా ఓడితే అంత త్వరగా ఇండియాకు స్వరాజ్యం వస్తుందను కోవడం తోను కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీలకు ద్వేషాలు ఏర్పడ్డాయి. షుమారు 150 సంవత్సరాల కాలం మనదేశాన్ని నాశనం చేసిన బ్రిటీషు గవర్నమెంటును భారతీయులు నాశనం చేయుటకు బదులు శత్రువైన బ్రిటన్‌తో కలసిన రష్యా జయాన్ని కాంక్షించుతున్న భారత కమ్యూనిస్టులను కాంగ్రెసు దేశభక్తులు అసహ్యించు కొన్నారు. అంతే కాదు. దేశ ద్రోహులని తిట్ట నారంభించారు. అప్పటి నుండి ఈ రెండు పార్టీలకు పొత్తు కుదరలేదు.

## సమిష్టి జీవితము – కాంగ్రెస్ నాయకులు

ప్రథమంలో జెయిలుకు వచ్చిన కమ్యూనిస్టు ఫార్వర్డు బ్లాకు డెటిన్యూలు కలసి ఒక "కమ్యూను" స్థాపించారు. ఎవరికే ఆహార పదార్థాలు తమ యిండ్లనుండి వచ్చినా (పండ్లు, మిఠాయీలు, పచ్చళ్ళు, అప్పడాలు వగైరా) కమ్యూనుకు యిచ్చే వారు. అందరూ కలసి సమిష్టిగా అనుభవించడమనే పద్ధతి ఏర్పాటు చేశారు. అలాగే చాలకాలం చాలా బాగా జరిగిపోతూ వచ్చింది. అయితే, కాంగ్రెసు నాయకులకు ఈ పద్ధతి నచ్చలేదు. వారేమో వ్యక్తిగతంగాను, వారిలోవారు చిన్న చిన్న ముఠాలు గాను వుంటూ వచ్చారు. కమ్యూనిస్టులు తమ పద్ధతిని మానలేదు. ఈ పరస్పర భేదాలు పెరిగిపోయాయి. అందరం కలసి భోజనం చేసే సమయంలో ముఠాలవారీగా జరగడం ముఖ్యంగా విద్యార్థులైన యువకులకు నచ్చలేదు. వారు అల్లరి ప్రారంభించారు.

యువకుల అల్లరి పడలేక కాంగ్రెసు వృద్ధ నాయకులు తమ తమ గదులలో ముఠాల వారీగా భోజనం చేయ నారంభించారు.

యువక దేశభక్తుల మనోభావాలను, దృక్పథాలను, వారి త్యాగాలను వృద్ధ నాయకులు గ్రహించలేక పోయారు. ఉమ్మడిగా కమ్యూనిస్టులు జీవించడమనేది నన్ను బాగా ఆకర్షించింది. కమ్యూనిస్టు యువకులు నన్ను కమ్యూనిస్టుగా మార్చ గల్గుటకు ముఖ్య కారణం యిదే.

అనేక వేల సంవత్సరాలుగా మనలో పాదుకు పోయిన సహపంక్తి భోజన నిషేధాన్ని రూపుమాపి, అందరం మానవులమే నన్న ఉన్నత భావాన్ని కలిగించుటకు జెయిలు జీవితం బాగా ఉపయోగ పడింది.

అయితే మాంసాహారానికి అలవాటు పడని వారికి సహ పంక్తి భోజనం చాల కష్టమైన పని. అందువల్ల మాంసంవున్న సమయాల్లో ముందుగా శాఖాహారులు భోంచేసిన తరువాత మాంసాహారులకు భోజనం పెడుతుండేవారం. ఇందుకు జనాబ్ అబ్దుల్ రహిమాన్ యం.యల్.ఏ. గారొక్కరు మాత్రం ఆక్షేపించుతూ వుండేవారు. వారికి సమాధానం చెప్పడం ఎవరికీ సాధ్యం కాలేదు. వంటపాత్రలు సైతం శాఖాహారులకు, మాంసాహారులకు వేరుచేశాము. కమ్యూనిస్టులలో చాలామంది

శాఖాహారులున్నారు.

## కాళేశ్వరరావుగారి లేఖ

జెయిలు నుండి విడుదలై వచ్చిన తరువాత మహాత్మా గాంధీ గారికి శ్రీ కాళేశ్వరరావుగారు ఒక ఉత్తరం వ్రాశారు. దానిలో కమ్యూనిస్టులు కాగానే శాకాహారులు మాంసాహారులుగా మారిపోతున్నారనీ, వేల ఏండ్లుగా వుండిన సాంప్రదాయాన్ని మానేశారనీ ఒక బ్రాహ్మణ యం.ఏ.గారినీ, ఒక వైశ్య బి. ఎస్‌సి. గారిని ఉదహరించారు. కమ్యూనిస్టు డెటిన్యూలలో ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణ ఎం.ఏ.లు వున్నారు గాని, అందరూ శాకాహారులే. వైశ్య బి.యస్.సి. నేనొక్కడినే. నేను మాంసం తినలేదు. అందరికీ బాగా తెలుసు. శ్రీ కాళేశ్వరరావు గారు పచ్చి అబద్ధం ఎందుకు వ్రాశారో ఇంత వరకూ నాకు అర్థం కావడంలేదు. కమ్యూనిస్టు కాగానే రాక్షసుడుగా మారి పోతాడనే అభిప్రాయాన్ని గాంధీగారికి కలుగజేయడానికి అలా వ్రాసి యుండ వచ్చును. బహుశా ఆ వుత్తరం రహస్యంగానే వుంటుందని అనుకొన్నారేమో!

## కాంగ్రెస్ యువకులు కమ్యూనిస్టులయ్యారు

జెయిల్లో గడచిన రెండు సంవత్స రాలలో బయటలాగే లోపల కూడా ఒక పాత కొత్తల యుగ సంధిగా వున్నది. యువకులు, వృద్ధులు ఒకరి కొకరు దూరమయిపోతూ వచ్చారు. సుమారు 150 మంది కాంగ్రెసు యువకులు తన నాయకుల యెదుటనే కమ్యూనిస్టులుగా మారిపోయారు. విడుదలకాగానే రాష్ట్ర మంతటా ప్రతి జిల్లాలోను తాలూకాలోను కమిటీలను స్థాపించారు. కమ్యూనిస్టుల, కాంగ్రెసువాదుల విభజన అప్పటి నుండి స్థిరపడిపోతూ వచ్చింది.

జైలు జీవితము చాలా కష్టమైనది. భోజనాలు, బట్టలు, పుస్తకాలు, వార్తా పత్రికలు కావలసి నన్ని వున్నా, మానసి కంగా చాల బాధ కలుగుతుంది. జీవితంలో మార్పు వుండదు. రోజూ ఒకే మాదిరిగా వుంటుంది. విసుగు పుడుతుంది. దానితో మానసిక వ్యాధులు కలుగుతాయి. ఘాటే రక్తపుపోటు (Blood Pressure) వ్యాధితో ఎన్నోసార్లు చావుకు సిద్దమయ్యాడు. అల్లూరి సత్యనారాయణ రాజు గారికి మూర్ఛవ్యాధి వచ్చింది. అతని బాధ భయంకరంగా వుండేది; అలాగే గారపాటి సత్యనారాయణగారికిన్నీ ఆ వ్యాధి సోకింది. విడుదలకాగానే వారందరికీ స్వస్థత చిక్కింది.

(ఇంకా ఉంది)

## వివాహం

హైద్రాబాద్ లోని సెక్రటేరియట్‌లో డిప్యూటీ సెక్రటరీగా ఉంటున్న శ్రీ జి.సి.గుప్త గారి కుమార్తె చి॥ అంజనీ కుమారి, యం.కాం., పి.జి.డి.సి.ఎ. గారి వివాహం, జాంబియాలో పనిచేస్తున్న శ్రీ ఎ.ఎస్.మూర్తి గారి కుమారులు చి॥ హర్షవర్ధన్, బి.టెక్. గారితో 24.5.1995వ తేదీన హైద్రాబాద్ నారాయణ గూడ లోని తాజ్‌మహల్ కేఫ్‌లో వైభవంగా జరిగింది.

# గుప్తగారి శ్రీ కన్యకా పురాణ ప్రచురణకు తోడ్పడండి
## - శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం విజ్ఞప్తి

మహాకవులు, అవధాని శేఖరులు శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు వ్రాసిన శ్రీ కన్యకాపురాణ ప్రచురణను పై పీఠం వారు ఆరంభించారు. రూ.116/-లు పంపి ఈ ప్రచురణకు తోడ్పడవలసిందిగా పై పీఠము వారు విజ్ఞప్తి చేస్తున్నారు. రూ.116/-లు పంపిన వారికి ఒక ప్రతిని పంపుతారు. అట్టివారు పీఠములో జీవితసభ్యులుగా కూడ ఉంటారు. రూపాయలను డి.డి.ద్వారా పంపువారు ఆ డి.డి.ని 'శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్యపీఠము' పేర ప్రొద్దుటూరులోని ఏ షెడ్యూలు బ్యాంకులో నైనా నగదు అగునట్లుగా, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్యపీఠం, కేరాఫ్ వైశ్యప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప - 516 002 అడ్రసుకు పంపాలి. రూపాయలను యం.ఓ. ద్వారా పంపువారు నేరుగా పై అడ్రసుకే పంపవచ్చు.

గుప్త గారి గ్రంథాలు, వెలుగు చూచుటకు తోడ్పడడం ప్రతి వైశ్యుడూ తమ విధిగా, కర్తవ్యంగా భావించాలి.

### ఇంతవరకూ అందిన విరాళాలు

రు.116-00 శ్రీ రామయ్య గారు, నంద్యాల.

రు.116-00 శ్రీ తమ్మలపల్లి సుబ్రమణ్యం గారు, తణుకు.

రు.116-00 శ్రీ అరిశెట్టి గున్నయ్య గుప్త, సాలూరు.

రు.116-00 డా॥ కె.యం.సుబ్బరంగయ్య, తాడిపత్రి.

రు.1116-00 శ్రీ విజయా బాడీ కేర్ ప్రొడక్ట్స్ ప్రై లిమిటెడ్, మద్రాసు.

రు.1500-00 శ్రీ విజయా బాడీ కేర్ ప్రొడక్ట్స్ ప్రై లిమిటెడ్, మద్రాసు. (ఈ పీఠం తరపున ఇవ్వదలచుకొన్న అవార్డుకు మొత్తములో సగము)

రు.216-00 శ్రీ దాసా వెంకటేశ్వర్లు, ప్రొ॥ దాసా టెక్స్‌టైల్స్, హిందూపురం.

రు.116-00 శ్రీ బి.సంజీవరావు, కర్నూలు.

రు.116-00 శ్రీ సి.బాల సుబ్రమణ్యం, బెంగుళూరు.

రు.116-00 శ్రీ యం.జె. రావు, కలకత్తా.

రు.116-00 శ్రీ నాగసరపు అంజనేయులు, నర్సరావుపేట.

రు.116-00 శ్రీ చీతిరాల గురు పెద్దన్న, నర్సరావుపేట.

రు.116-00 శ్రీ ఇన్నమూరు పద్మనాభయ్య, బద్వేల్.

రు.116-00 శ్రీ కె.పి.బాలుడు, రూర్కెలా.

రు.116-00 శ్రీ సి.చంద్రమౌళీశ్వరరావు, నూజువీడు.

### కె.పి.అన్నయ్యకు మాతృ వియోగం

కడప వైశ్య ప్రముఖులు శ్రీ కె.పి. అన్నయ్య గారి మాతృమూర్తి శ్రీమతి కుంజేటి శేషమ్మ గారు 10.5.1995వ తేదీన స్వర్గస్తులయ్యారు.

# వల్లూరు ఆర్యవైశ్య సంఘం రజతోత్సవము - అధ్యక్షుల చిత్ర పటావిష్కరణ మహోత్సవం

కడప జిల్లా వల్లూరు పట్టణ ఆర్యవైశ్య సంఘ రజతోత్సవం 5-6-1995వ తేదీ సాయంత్రం 4 గం॥కు వల్లూరు లోని శ్రీ వాసవీ ఆర్యవైశ్య భవనములో ఘనంగా జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించు కొని జరిగిన రజతోత్సవ సభకు ఈ పత్రికా సంపాదకులు, 'సంఘోద్ధారక' 'వైశ్యభూషణ' శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు అధ్యక్షత వహించారు. ప్రొద్దుటూరు వైశ్య ప్రముఖులూ, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం అధ్యక్షులూ, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య ఉపాధ్యక్షులూ శ్రీ జూటూరు రమణయ్య గారు ఈ సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కడప జిల్లా ఆర్యవైశ్య సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ వల్లంకొండు వెంకటసుబ్రమణ్యం గారు ప్రత్యేక ఆహ్వానితులుగా పాల్గొన్న ఈ సభను కడప జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ అంబటి గంగ గోపాల్ గారు ప్రారంభించారు. కడప పట్టణ ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ సోమిశెట్టి వెంగయ్య గారు ఈ సభలో జ్యోతి ప్రజ్వలన చేశారు.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య అధ్యక్షులూ, ప్రొద్దుటూరు పురపాలక సంఘాధ్యక్షులూ 'ప్రజాబంధు' 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈ రజతోత్సవ శుభ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ సంఘానికి ఇరవై ఐదేండ్లుగా అధ్యక్షులుగా ఉండి సంఘాభివృద్ధికి అనిర్వచనీయమైన సేవ చేసిన శ్రీ మదళ్ళపల్లె సుబ్బరాయుడు శ్రేష్ఠి గారి ఛాయా చిత్ర పటాన్ని ఆవిష్కరించి, శ్రేష్ఠి గారిని పుష్పమాలాలంకృతుల చేసి శాలువను గప్పి, ఘనంగా సన్మానించారు. తదుపరి పలువురు అభిమానులూ, సంఘ నిర్వాహకులు శ్రీ శ్రేష్ఠి గారిని ఘనంగా సత్కరించారు.

శ్రీ పోలేపల్లె నారాయణ శ్రేష్ఠి గారు స్వాగతం పలికిన యీ సభలో సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ గాజులపల్లె వెంకట రామయ్య శ్రేష్ఠి గారు రజతోత్సవ నివేదిక సమర్పించారు. కడప జిల్లా ఆర్య వైశ్య సంఘం ఉపాధ్యక్షులు శ్రీ తంబి సుబ్బరామయ్య శ్రేష్ఠి ప్రభృతులు ఈ సభలో ప్రసంగించారు ఈ సభలో పాల్గొన్న వారందరూ కూడ అధ్యక్షులుగా శ్రీ సుబ్బరాయుడు గారు చేసిన కృషినీ, వల్లూరు ఆర్య వైశ్య సంఘ విశిష్టతనూ వేనోళ్ళ ఉగ్గడించారు.

స్వర్గీయ శ్రీ పోలేపల్లె వెంగన్న (రాజా) శ్రేష్ఠి గారి ఛాయా చిత్రపటము ఈ వల్లూరు శ్రీ వాసవీ ఆర్యవైశ్య భవనములో ఉండడం ఎంతైనా ఆవశ్యకమని వక్తలు చెప్పగా, ఈ సంఘ నిర్వాహకులెల్లరూ అతి త్వరలో శ్రీ రాజా శ్రేష్ఠి గారి ఛాయాచిత్ర పటాన్ని ఈ భవనములో ఆవిష్కరిస్తామని ఏక వాక్యంతో చెప్పారు. సహాయ కార్యదర్శి శ్రీ మేడా మోహన్ రావు గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1995 జూన్ 21 నుండీ 1995 జూలై 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 25 | 2 | 9 | 16 |
| సోమవారము | | 26 | 3 | 10 | 17 |
| మంగళవారము | | 27 | 4 | 11 | 18 |
| బుధవారము | 21 | 28 | 5 | 12 | 19 |
| గురువారము | 22 | 29 | 6 | 13 | 20 |
| శుక్రవారము | 23 | 30 | 7 | 14 | |
| శనివారము | 24 | జూలై 1 | 8 | 15 | |

జూన్ 22 :- ఆరుద్ర కార్తె రాక - రాత్రి 8-12

జూన్ 30 :- వ్యాపారరీత్యాకానీ, వృత్తిరీత్యాకానీ ఆదాయముగల అసెసీలు తమ ఆదాయపు పన్ను రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

జూన్ 30 :- ఆదాయపు పన్ను చట్టములోని 19 A విభాగము క్రింద సెక్యూరిటీల మీద వచ్చు వడ్డీలు కాక ఇతర వడ్డీల విషయంగా పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం. 26 A ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు తుదిరోజు

జూన్ 30 :- ఆదాయపు పన్ను చట్టములోని 193 విభాగము క్రింద సెక్యూరిటీల ద్వారా వచ్చు వడ్డీలను పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు, ఫారము నెం.25 ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

జూన్ 30 :- ఆదాయపుపన్ను చట్టములోని 194 C విభాగము క్రింద కాంట్రాక్టర్లు సబ్ కాంట్రాక్టర్లకు చేసిన చెల్లింపుల విషయంగా, పట్టుకొన్న మొత్తము పన్ను వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం.26 C ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి పంపుటకు చివరి రోజు.

జూన్ 30 :- ఆదాయపు పన్ను చట్టములో 194 D విభాగము క్రింద ఇన్సూరెన్సు కమీషన్ విషయంగా తగ్గించుకొన్న మొత్తము పన్ను వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం.26 D ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు కడపటి తారీఖు.

జూన్ 30 :- ఇన్సూరెన్సు కమీషన్‌కు సంబంధించి ఆ సంవత్సరములో వ్రాసుకొన్న వివరాలను తెలుపు అన్యువల్ రిటర్ను ఫారము నెం.26 E ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు కడపటి తేది

జూలై 6 :- పునర్వసు కార్తె రాక - రా 9-57. జూలై 8 :- తొలి ఏకాదశి - చాతుర్మాస్య వ్రతారంభం

జూలై 15 :- సి.యస్ టి. ఫారాన్ని రెండు కాపీలుగా అందులో చూపబడిన మేరకు కట్టవలసిన అమ్మకం పన్నుకు సంబంధించిన డిమాండు డ్రాఫ్టుతో అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరుతేది

జూలై 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

జూలై 16 :- ప్రాగస్త శుక్ర మౌఢ్యారంభం. జూలై 17 :- దక్షిణాయన పుణ్య కాలం.

జూలై 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**25, 2, 9, 16 ఆదివారాలు**

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా "VASAVI"
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,
పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరంనకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి: 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగో అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేదరిమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్తులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్తు నుండి వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి విధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును. వీరికి

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫొటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫొటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫొటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం – 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

N.B :- పై సత్రముల పేరుతో – D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.




రైతులోకానికి మా శుభాకాంక్షలు

మీ పొలాల్లో పెరిగే పైర్లకు
వచ్చే తెగుళ్ళకు

**మా " జ్యోతి బ్రాండు " మందులనే వాడండి**

మాచే తయారుచేయబడే గెమాక్సిన్ 5%, 10%, B.H.C. 10% Dust & 50 % WDP, Malathion 5% Dust & 50% EC, Endosulphan 35% EC, Monocrotophos 36% WSC, Quinolphos 25% EC, Dimethoate 30% EC, Methyl Parathion 50% EC, Cypermethrin 10% EC, Fenvalrate 20% EC, మొదలగు క్రిమిసంహారక మందులు దేశవ్యాప్తంగా ఉపయోగించబడి తెగుళ్ళ నివారణకు అమోఘంగా పనిచేయుచున్నవి.

**ఆదిత్యా మినరల్ ట్రేడర్స్**

కొండాపురం (R.S.) కడపజిల్లా. PIN - 516 444

**Vasavi**

**వాసవి**

**వైర్లు మరియు పైపులు**





**నాణ్యతకు, మన్నికకు, పేరెన్నిక గన్నవి**

తయారుచేయు వారు :

**వాసవీ ఇండస్ట్రీస్**
18/638 - బి, గుత్తిరోడ్,
గుంతకల్ - 515 801

**VASAVI INDUSTRIES**
18/638-B, Gooty Road,
GUNTAKAL - 515 801

# రామచరిత మానసం

(తులసీ రామాయణము)

తెలుగుసేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.,

(గత సంచిక తరువాయి)

ఈ విధంగా కాక భుశుండి పలికిన పలుకులు విని గరుత్మంతుడు మిక్కిలి సంతోషించాడు. ఆయన కాక భుశుండికి నమస్కరించి స్వామీ, నన్ను మీ సేవకునిగా భావించండి. దయచేసి నేను అడిగే ఏడు ప్రశ్నలకు సమాధానాలివ్వండి.

1) అన్నిటి కంటే దుర్లభమైన శరీరం ఏది?

2) అన్నిటి కంటే గొప్పదైన దుఃఖం ఏది?

3) అన్నిటి కంటే గొప్ప సుఖం ఏది?

4) సజ్జనులకు దుర్జనులకు గల భేదమేమిటి?

5) అన్నిటి కంటే భయంకరమైన పాపమేది?

6) అన్నిటి కంటే గొప్ప పుణ్యమేది?

7) మనో రోగాలనగా ఏవి?"

వినయపూర్వకమయిన గరుత్మంతుని ప్రశ్నలకు కాక భుశుండి ఎంతగానో సంతోషించి ఈ విధంగా జవాబులు చెప్పాడు.

1) "నాయనా, లోకంలో మానవ శరీరం కంటే ఉత్తమమయినది మరొకటి లేదు. సమస్త చరా చర ప్రాణులు మానవుణ్ణి ఆశ్రయించి బ్రతుకు తున్నాయి. స్వర్గ నరకాలకు మానవ జన్మమే నిచ్చెన వంటిది.జగత్కల్యాణ కరములైన భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు మానవ శరీరం నందే మనకు లభిస్తాయి. ఇటువంటి మానవ జన్మము లభించీ కూడా శ్రీహరి భజన చేయని మూర్ఖులు చేతియందలి పరుస వేదిని పారవైచి పలుగు రాళ్లకై ప్రయత్నం చేసిన వాళ్లవుతారు.

2) పక్షిరాజా! ధరణిలో దారిద్ర్యాన్ని మించిన దుఃఖము మరొకటిలేదు. సకల బాధలకు దారిద్ర్యమే మూలం.

3) ఈ లోకంలో సజ్జన సాంగత్యము వంటి సుఖము మరొక్కటి కానరాదు. సాధుసాంగత్యమే సర్వసుఖాలకు మూలం.

4) సజ్జనులు మనోవాక్కాయ కర్మలతో పరోపకారం చేస్తారు. ఇది వాళ్ల సహజ స్వభావం. దుర్జనులు ఇతరులకు దుఃఖము కలిగిస్తారు. వాళ్లు స్వార్థపరులై ఇతరులను హింసిస్తారు. దుర్జనులు పాముల మాదిరి, ఎలుకల మాదిరి కారణం లేకుండానే ఇతరులకు అపకారం చేస్తూ వుంటారు. దుర్మార్గులైన వాళ్లు వడగళ్ల వంటి వాళ్లు. వడగళ్లు పంటను పాడు చేసి తాము కూడా నశించి పోయినట్లే దుష్టులు పరుల సంపదను నాశనంచేసి తమకు తాము నశించి పోతారు. సత్పురుషుల అభ్యుదయము చంద్రోదయం మాదిరి, సూర్యోదయం మాదిరి జగత్తుకు సంతోషదాయక మయినది.

5) పరనిందవంటి మహాపాపము మరొకటిలేదు. శివుని నిందించేవాడూ, గురువును నిందించేవాడూ తప్పకుండా

కప్ప-కడుపున పుడతారు. బ్రాహ్మణ నింద చేసేవాడు కాకి కడుపున పుడతాడు. వేదాలను దేవతలను నిందించే మూర్ఖులు రౌరవాది ఘోర నరకాల్లో పడతారు. సత్పురుషులను నిందించేవాళ్లు గుడ్లగూబలై పుడతారు. సకల జనులను నిందించే దుర్జనుడు గబ్బిలమై పుట్టి చీకట్లో తలక్రిందుగ వ్రేలాడతాడు.

6) అహింసవంటి పరమ పుణ్యం మరొకటి లేదు.

7) పక్షిరాజా! ఇక మనో రోగ మనగా ఏమిటంటే, అన్నిరోగాలకు మోహమే మూలం. కామం వాతరోగం. లోభం కఫరోగము. క్రోధం పిత్తరోగం. వాత, పిత్త, కఫములు కలిసినచో అన్ని అనర్థాలకు మూలమయిన సన్నిపాత రోగము వస్తుంది. ఇంకా చాలా రోగాలున్నాయి. మమత్వము తామర. ఈర్ష్యయే గజ్జి. అసూయ క్షయరోగం. కుటిలత్వము కుష్టురోగం. అహంకారము కీళ్లవాపు.

జపతపో జ్ఞానాలవల్ల గాని, యజ్ఞాల వల్లగాని, దాన ధర్మాల వల్లగాని ఈ రోగాలు నశించవు. ఈ సమస్త రోగాలకు శ్రీ రాముని కరుణయే మహౌషధము. రామ భక్తి సంజీవని వంటిది. ఈ భక్తి సంజీవని అనేమందు శ్రద్ధతో నూరి సద్బుద్ధి అనే అనుపానంతో చేర్చి సేవిస్తే సమస్త రోగాలూ నశిస్తాయి. మానవుడు ఆరోగ్య వంతుడవుతాడు.

రామ భక్తిలేనిదే ఎటువంటి చతురుడైనా కడతేర లేడు. శ్రీ రాముణ్ణి విమర్శించిన వాడు సుఖం పొందలేడు. నీళ్లను చిలుకుతే నెయ్యి వస్తుందా? దృఢమైన భక్తి లేనిదే మానవుడు సంసార సముద్రాన్ని దాటలేడు. భగవంతుడు తల్చుకుంటే దోమను బ్రహ్మను చేయగలడు. బ్రహ్మను దోమగా మార్చగలడు. కనుకనే మహాత్ములందరూ శ్రీ రాముణ్ణి భజిస్తూ వుంటారు. నేను అన్ని జన్మలు ఎత్తిన అనుభవంతో చెబుతున్నాను. శ్రీ రామ చరిత్ర అద్భుతమైనది. నేను నీకు క్లుప్తంగా చెప్పాను. అందరూ అన్ని వికారాలూ వొదిలిపెట్టి శ్రీ రాముని భజించవలెనని వేదాలూ, పురాణాలూ చెబుతున్నాయి. మీరు కూడా శివునికి ప్రియమైన శ్రీ రామచరిత్రను అడిగారు. నేను అధమ జన్మమైన కాకినై పుట్టినా, శ్రీ రాముణ్ణి మరువలేదు.

నన్ను శ్రీ రాముడు తనభక్తులైన సత్పురుషులలో ప్రథముడిగా భావించాడు. శ్రీ రామచరిత్రము అపారమైన సముద్రము వంటిది. సంసార సాగరాన్ని దాటాలంటే, శ్రీ రాముణ్ణి తదేక దృష్టితో స్మరించాలి. లేని యెడల దాటలేరు.

మంగళ కరమగు కాక భుశుండి మాటలు విని గరుత్మంతుడు ఆయనకు నమస్కరించి ఇలా అన్నాడు. "స్వామీ! మీ వలన శ్రీ రాముని గుణగణాలు విని కృతార్థుడనయ్యాను. మోహమనే సముద్రంలో మునిగి తేలుతున్న నాకు మీరు నావ మాదిరి సహాయపడ్డారు. ఇందుకు నేను మీకు ప్రత్యుపకారం ఏమి చేయ గలను. ఒక నమస్కారం చేస్తున్నాను.

నదులు, వృక్షాలు, పర్వతాలు, భూమి మొదలగు వస్తువులన్నీ ప్రాణికోటికి ఉపకారం చేస్తున్నాయి. వాటి హృదయాలు ప్రేమతో నిండి వుంటాయి. కనుక కవులు పొగడు తున్నారు. సత్పురుషుల హృదయాలు వెన్న వంటివని వర్ణిస్తున్నారు. అసలు సంగతి చెప్పరు. ఎందుకనగా

వెన్న అగ్నితాపము వలనగాని కరగదు. పరమ పవిత్రులైన సత్పురుషుల హృదయాలు ఇతరుల కష్టాలను చూడగానే కరిగిపోతాయి.

"ఓ భక్తాగ్రగణ్యా, మీ దయవలన అన్ని సందేహాలూ తొలగిపోయాయి. నా జీవితము ధన్యమయింది. నా జన్మ సఫలమయింది.మీ కృపవలన కృతార్థుడనయ్యాను, నన్ను మీ దాసునిగా భావించండి"

పార్వతీ, గరుత్మంతుడు ఈ విధంగా మాటి మాటికీ కాక భుశుండిని మెచ్చుకుంటూ, నమస్కరించి ఆయన వద్ద సెలవు తీసుకొని రామ నామస్మరణ చేస్తూ వైకుంఠానికి వెళ్లిపోయాడు.

## పరిసమాప్తం

ఉమా, లోకంలో సత్పురుష సంగమము కంటే లాభదాయకమయినది మరియొకటిలేదు. అటువంటి సత్సంగము ప్రభువు దయలేనిదే ప్రాప్తించదు.

గౌరీ, ఈ పవిత్రమైన చరిత్రం నీకు వినిపించాను. ఈ కథను వీనుల విందుగా విన్నవారికి భవ బంధాలు తొలగిపోతాయి. భక్తజన కల్పవృక్షమై దయాసాగరుడయిన శ్రీ రామచంద్రుని చరణ కమలాల యందు భక్తి ఏర్పడుతుంది. త్రికరణ శుద్ధిగా ఈ కథను విన్న వారికి మనోవాక్కాయ కర్మలచే ఉత్పన్నమైన సమస్త పాపాలు నశిస్తాయి. దానాలు, ధర్మాలు, వ్రతాలు, జపాలు, తపాలు మొదలగు వాటి వలన కలిగే ఫలము శ్రీ రామచంద్రుని చరణ కమలాలందలి భక్తి వలన కలుగుతుంది. శ్రీ రాముని పాదా లందు భక్తి కల మానవుడే సర్వజ్ఞుడు. అతడే ఈ ధరణికి అలంకారము. అతడే మహా విద్వాంసుడు. అతడే మహాదాత. అతడే ధర్మ పరాయణుడు.

హైమవతీ, నీకు రాముని యందుగల అచంచల భక్తిని తెలుసుకొని నీకు రామ కథ వినిపించాను. రఘువీరుని చరిత్రము వినుటకు రామభక్తులు మాత్రమే యోగ్యులు. శ్రీ రాముని చరణాలకు దూరమైన లోభులు, కాముకులు, దురాచారులు ఇందులకు అర్హులు కారు. ఇది సర్వపాప హరము. కలి కల్మష నాశకము, భవరోగ నివారకము, శ్రీ రామకథ చెప్పిన వారు, విన్న వారు, ప్రశంసించిన వారు ఈ సంసార మహాసముద్రాన్ని గోష్పాదం మాదిరి దాటుతున్నారు.

పరమేశ్వరుని పలుకులు విని పార్వతీ దేవి పరమానంద భరితురాలైంది. ఆమె పరమశివుని చూసి"స్వామీ, మీ కృప చేత నా సందేహాలన్నీ పటాపంచలై పోయాయి. ఓ విశ్వపతీ, మీ అనుగ్రహంతో నేను ధన్యురాలనయ్యాను." అని పలికింది.

జగత్కల్యాణ కారణమైన పార్వతీ పరమేశ్వర సంవాదము భక్తులకు బ్రహ్మానంద దాయకమయినది. సత్పురుషులకు సంతోష ప్రదమయినది. శ్రీ రామకథ సర్వసౌభాగ్య సంపన్నము. సకల శ్రేయో నిదానము.

ఈ విధంగా ఉమామహేశ్వర సంవాద రూపమయిన శ్రీ రామచరిత్రను యాజ్ఞవల్క్య మహాముని భరద్వాజ మహామునికి ఎంతో ఆదరంతో వినిపించాడు.

తులసీదాసు ఇలా చెబుతున్నాడు.

ఈ కలికాలంలో శ్రీ రామ నామస్మరణ, శ్రీ రామగుణ సమూహాలను కీర్తించుట, నిరంతరం రామ గుణాలను

వినుట ఇంత కంటే వేరే యోగసాధన, జప, తప, పూజా వ్రతాలులేవు.

పతితపావనుడని వేదాలు, పురాణాలు, కవులు, సత్పురుషులు ఎవర్ని కీర్తిస్తున్నారో, ఓమనసా, నీవు కూడా ఆయన్నే భజించు. రామస్మరణ చేసి పరమ గతిని పొందని వాళ్ళు ఎవరున్నారు?

ఓ మూర్ఖ మనసా, పతితులను కూడా పవిత్రులను చేసే శ్రీరాముని భజించి పరమగతిని పొందనివాళ్ళు ఎవరున్నారు? గణిక, అజామిలుడు, వాల్మీకి, జటాయువు, గజేంద్రుడు మొదలగు దీనులను ఎంత మందినో ఆయన తరింప జేశాడు

శ్రీ రఘువంశ శిరోమణి రామ చంద్రునిచరితము చెప్పేవారూ, వినేవారూ, గానం చేసే వారూ, కలియుగ పాపాలను, మనోమాలిన్యాన్ని కడిగి వేసుకొని సులభంగా పరంధామాన్ని చేరుకుంటారు. ఎక్కువగా గాకపోయినా మనోహరమైన ఐదారు పద్యాలు ఎన్నుకొని హృదయ మందు పదిల పరచుకొని గానం చేసేవాళ్ళు అయిదు రకాలైన అవిద్యల వలన ఉత్పన్న మయ్యే వికారాల నుండి విముక్తి పొందుతారు.

పరమ సౌందర్యవంతుడు, సజ్జనుడు, కృపానిధి అయివుండి అనాధలను ప్రేమించేవాడు ఒక్క శ్రీరామచంద్ర మూర్తియే! ఈయన మాదిరి సులభంగా మోక్షం కలుగ జేసేవాళ్ళు మరెవరున్నారు? అటువంటి రామప్రభువు యొక్క కొద్ది పాటిదయతోనే మంద బుద్ధియైన తులసీదాసు పరమ శాంతిని పొందాడు. ఇటువంటి ప్రభువు మరెక్కడాలేడు.

ఓ రామచంద్రా, నాలాంటి దీనుడు మరెవరూ లేడు. మీ లాంటి దీనజనోద్ధార కుడు మరెవరూ లేడు. కనుక ఓ రఘు వంశభూషణా, భయంకర జన్మమరణ దుఃఖాన్ని తొలగించి శాంతిని చేకూర్చు.

కాముకుడికి స్త్రీ, లోభికి ధనమూ ప్రియమయినట్లు నాకు ఎల్లప్పుడు శ్రీ రఘునాధుడు ప్రియముగా వుండుగాక.

శ్రీ రాముని చరణకమలాలయందు నిత్యమూ నిరంతరమూ భక్తి కలిగి వుండ గలందులకు శ్రేష్ఠకవి శంకర భగవానుడు ఈ మానస రామాయణాన్ని రచించాడు. శ్రీ రఘురాముని నామమందు శ్రద్ధకలిగి తన అంతః కరణములోని అంధకారాన్ని తొలగించుకొనుటకు తులసీదాసు ఈ "మానసం" రూపంలో రచించాడు.

పుణ్యం పాపహరం సదాశివకరం
విజ్ఞాన భక్తి ప్రదమ్,
మాయామోహ మలాపహం సువిమలం
ప్రేమాంబు పూరం శుభమ్,
శ్రీ మద్రామ చరిత మానస మిదం
భక్త్యావగాహన్తియే,
తే సంసార పతంగ ఘోరకిరణై
ర్దహ్యంతి నో మానవా!

శ్రీ రామచరిత మానసం పుణ్య ప్రదము. పాపహరము. శుభదాయకము. భక్తి విజ్ఞానములు చేకూర్చును. మాయా మోహముల నాశకరము. ఇది ప్రేమ రూప నిర్మల జల పూరితము. శుభకరమైనది. భక్తిపూర్వకంగా ఈ మానస సరోవరంలో మునకలు వేసేవాళ్ళు సంసార రూప సూర్యుని యొక్క ప్రచండ కిరణాల తాకిడికి కమిలిపోకుండా వుంటారు.

కలియుగంలో సమస్త పాపాలనూ నాశనం చేసే శ్రీ మద్రామ చరిత మానసం సప్తమ సోపానం సమాప్తం.

ఉత్తర కాండం సమాప్తమ్.

# ఆయుర్భావ విచారణ

రచన : శ్రీ సత్రసాల వేణుగోపాల్, బి.ఎ, ధర్మవరము

"జాతస్య మరణం ధృవం" పుట్టినవాడు గిట్టక మానడు అను మరణ ఘోష మానవాళికి తెల్పినప్పటికి తన ఆయుర్భావ విషయం తెలుసుకోవాలి అనే ఉత్సుకత మానవునికి వుండుట సహజము. అది న్యాయబద్ధము కూడ. జీవితములో సాధించవలసింది, సాధించబోయే కార్యాలను క్రమబద్ధము చేసుకొనే దానికి వీలు కలుగునుకదా అనే ఆశ వుండుట సహజము కాననే మానవుడు పై భావ విచారణకు ఉత్సుకత కనబరుస్తాడు.

ఈ భావము లగ్నము నుండి ఎనిమిదవది. ఈ భావ విచారణ చేయునపుడు ముఖ్యంగా లగ్నాధిపతిని, అష్టమాధిపతిని, అష్టమమునకు అష్టమము మూడవ భావమును, దశమ భావమును, అష్టమ భావమును, ఆయుఃకారకుడగు శనిని బాగుగా గమనించవలెను. ఆయుర్భావమును శాస్త్ర వేత్తలు నాలుగు విధములుగా నిర్ణయించినారు. అవి ఏమన.-

1. అల్పాయుర్దాయము :- అనగా ముప్పై సంవత్సరముల వరకు ఆయువు గల వారిని అల్పాయుష్కులు అని అందురు.

2. మధ్యమాయుర్దాయము :- అనగా అరువది సంవత్సరముల వరకు జీవించు వారిని మధ్యమ ఆయుష్కులు అని అందురు.

3. పూర్ణాయుర్దాయము :- అనగా ఎనభై సంవత్సరముల దాకా జీవించు వారిని పూర్ణాయుష్కులు అని అందురు

4. దీర్ఘాయుర్దాయము :- అనగా నూట ఇరువది సంవత్సరముల దాకా జీవించు వారిని దీర్ఘాయుష్కులు అని అందురు.

అయుర్విషయమున నైసర్గిక శుభులకు యే ఆధిపత్యము పట్టినను కేంద్ర స్థితి ఆయుర్వృద్ధి. కోణ స్థితి దాని కంటే కొంచెము తక్కువ నైసర్గిక పాపులకు ఏ అధిపత్యము పట్టినను కేంద్ర స్థితి ఆయు క్షీణము. కోణ స్థితి కొంచెము మేలు 3, 6 ఆయుర్ వృద్ధి. శనికి 3, 6 శుభమును ఇచ్చును. 8, 11 అత్యంత లాభమును ఇచ్చును. నైసర్గిక శుభులకు, పాపులకు 11వ స్థానము ఆయుర్వృద్ధి అనుటలో సంశయము ఎంత మాత్రము లేదు. మారక స్థానములను 12, 2, 7 అని శాస్త్రవేత్తలు నిర్ణయించిరి. ద్వాదశము కంటే సప్తమము, సప్తమము కంటే ద్వితీయము ప్రబల మారక స్థానములు. (అష్టమ మందున్న శని పురుష జాతకమునకు ప్రబల మారకుడు).

1, 8, 10 అధిపతులు ముగ్గురు బలయుతులుగా వున్న పూర్ణాయుర్దాయము పట్టును. బలహీనముగా వున్న ఆయుర్దాయము నష్టమని చెప్పవచ్చును. అష్టమాధిపతి స్వక్షేత్రమందున్నను, శని స్వక్షేత్ర, ఉచ్ఛ, మిత్ర క్షేత్రములయందున్న పూర్ణాయుర్దాయము పట్టును. దశమాధిపతి ఉచ్ఛ, స్వక్షేత్రములయందు వున్న గాని, లగ్న, అష్టమ రాజ్యాధిపతులు కేంద్ర

కోణములయందున్నను జాతకునకు పూర్ణాయుర్దాయము పట్టును 4 కేంద్రముల యందు శుభగ్రహములు వుండి శుభ గ్రహములచే చూడబడి కాని లగ్నాధిపతి గురునిచే చూడబడిన యెడల పూర్ణాయుర్దాయము పట్టును.

6, 7, 8 స్థానముల యందు శుభ గ్రహములున్నను, 3, 6, 11 స్థానముల యందు పాప గ్రహములున్నను జాతకునకు పూర్ణాయుర్దాయమనియే చెప్పవచ్చును లగ్నాధిపతి కేంద్రమందున్నను జాతకుడు పూర్ణాయుష్కుడే అష్టమమందు రాహువు, కేంద్రమందు గురువు వున్నను, ఆయుః కారకుడగు శని 5, 8, 11 ఇంట వున్నను జాతకుడు నిశ్చయముగా పూర్ణాయుష్కుడనవచ్చును. లగ్నాధిపతి 1, 4, 7, 10 కేంద్రములయందుండి గురునిచే చూడబడిన యెడల పూర్ణాయుర్దాయము వచ్చును లగ్న అష్టమాధిపతులు 6, 8, 12 స్థానములయందుండి తత్ స్థానాధిపతులు లగ్న కేంద్రములయందున్న దానిని సహ పూర్ణాయుర్దాయమే అని అనవచ్చును

చంద్రుడు ఉచ్చయందు కాని, మిత్ర క్షేత్రములయందు కాని గురు, శుక్రులచే కలసినను, చూడబడినను పూర్ణాయుర్దాయ జాతకమనియే అనవచ్చును. లగ్న దశమాధిపతులు పంచమాధిపతిచే చూడబడినను, లేక 1, 7, 5, 10 స్థానములయందున్నప్పటికి అదియు పూర్ణాయుర్దాయ జాతకమే. ఇది కాక చంద్ర లగ్నాత్తు అష్టమాధిపతిని బట్టి కూడ అయుర్దాయ విషయమును చెప్పవచ్చును. శని మిత్ర క్షేత్రమగు లాభ స్థానమునందున్న కాని, నవమాధిపతి లగ్నాధిపతితో కలసినను, చూడబడినను పంచమాధిపతిని గురువు చూచినను దశమాధిపతి ఉచ్చయందు కాని, పంచమాధిపతితో కలసినను, అట్టి జాతకుడు మధ్యమాయుష్కుడని చెప్ప వచ్చును.

లగ్నము నందు గురువు బలయుతుడుగా వున్నను, రాహువు, వృషభ, మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, మకరముల యందు వున్నపుడు అరిష్టములు ఎన్ని వున్నప్పటికి అన్నియు తొలగి పోయి దీర్ఘాయుష్మంతుడు అగును. చంద్రుడున్న రాశికి 3, 6, 11 స్థానములలో రాహువు వుండి శుభ గ్రహములచే చూడబడినను, లగ్నమునకు 3, 6, 11 స్థానములలో రాహువు వున్నను జాతకుడు అఖండ ఐశ్వర్యమంతుడు, దీర్ఘాయుష్కుడు అగునని జాతక నిర్దేశము. లగ్నాధిపతి బలహీనుడై శుభగ్రహ దృష్టి లేక 6, 8, 12 స్థానములయందు వున్నను శుభ దృష్టి లేక పాప గ్రహములు వున్న యెడల అట్టివాడు సంతాన హీనుడు, అల్పాయుష్కుడు అని అనవచ్చును

గురు, శుక్రులు కోణములయందున్న మధ్యమాయుర్దాయము. అష్టమమందు కాని, లాభమందు కాని శని వుండి, కేంద్ర కోణములయందు చంద్రుడు వున్న అది మధ్యమ అయుర్దాయము. లగ్న, లాభాధిపతులు పరివర్తన గతులై శుభ గ్రహ యుక్తులుగా గాని, శుభగ్రహ దృష్టి గాని కలిగివున్న అది మధ్యమాయువు. శని, కేతువులు 11 ఇంట వున్న అదియును మధ్యమాయువే. గురు, శుక్ర, చంద్రులు గాని, గురు, బుధ, చంద్రులు గాని, శుక్ర, బు ధ, చంద్రులు కాని, రవి, శుక్ర, చంద్రులు గాని, శని, శుక్ర, చంద్రులు గాని, శని,

గురు, చంద్రులు గాని కలసిగాని, విడిగా కాని పంచమ నవములందున్న అది మధ్యమాయువు. గురు, శుక్ర, బుధ పూర్ణ చంద్రులలో ఒకరైనను కేంద్ర కోణములలో లేని యెడల అది అల్పాయువు అని గుర్తించుము. అష్టమాధిపతి స్వక్షేత్ర మందు వున్న యెడల దీర్ఘాయుర్దాయము పట్టును. శని స్వక్షేత్ర ఉచ్ఛ, మిత్ర క్షేత్రముల యందున్న దీర్ఘాయుర్దాయము పట్టును

ఆయుఃస్థానాధిపతి ఉచ్ఛయందుండి, శని శుభ గ్రహములతో కలసిన యెడల జాతకుడు పూర్ణాయుష్కుడగును. లగ్న మందు గురువు బలముగల వాడై వున్న సమస్త పాప నివారణ, పాపగ్రహ అరిష్ట నివారణ జరుగును. రాహువు మేష, వృషభ, కర్కాటక, సింహ, వృశ్చిక, మకరముల యందు వున్న సర్వారిష్టములన్నియు తొలగి శుభయుత దీర్ఘాయుష్మంతుడగును. పండ్రెండింట చంద్రుడు, లగ్న మందు శని, అష్టమమందు పాప గ్రహములున్న జాతకుడు మరణము పొందుట నిశ్చయము. శుభ గ్రహములగు గురు, బుధ, శుక్రులు కేంద్రకోణములందున్న పూర్ణాయువును, 6, 8, 13 యింట అల్పాయువును, 2, 3, 11 యింట వున్న మధ్యమాయువును ఇచ్చెదరు.

పాపులగు రవి, కుజ, రాహు కేతువులు 1, 4, 7, 10 5, 9, 8, 12 స్థానముల యందు అశుభమునే ఇచ్చెదరు. 3, 6, 11 స్థానములయందున్న పూర్ణాయువును ఇత్తురు. ద్వితీయమందున్న శుభ, అశుభ మిశ్రమమై వుండగలదు. ఆయుఃస్థాన విషయమునందు ముఖ్యముగా గమనించ దగ్గ విషయము లగ్నము, లగ్నాధిపతి, లగ్నాధిపతియున్న రాశి నాథుడు, శుభ స్థానములందున్నను, శుభ గ్రహములచే చూడబడిన పుట్టిన జాతకుడు కీర్తివంతుడు. ధన, యశోవంతుడై దీర్ఘకాలము మన గలుగు, ధీరోదాత్తుడై విరాజిల్ల గలడు అట్లు గాక ఏ తత్ విరుద్ధ గతిని గ్రహ స్థానములు, గ్రహ దృక్కులు వున్న నిశ్చయముగ జాతకుడు ధన హీన, ధర్మ హీన, బుద్ధి హీన, భార్యా హీన విరతుడై మంద బుద్ధి గలవాడై మనగలడు 2, 8 లగ్నములయందు శుభగ్రహములు వుండినను, లేక శుభ గ్రహములు చూచినను గురుడు కేంద్రములయందున్న యెడల జాతకుడు నిండు నూరేళ్ళు జీవించుననుట నిర్వివిధాంశము

పండ్రెండు సంవత్సరముల వరకు మనుష్యులకు ఆయుర్దాయము నిర్ణయించుట దుర్లభవము. కాన అంత దాక, జపములచేత, తపములచేత, భగవత్ ప్రీతికరమగు కార్యములచేత, చికిత్సలచేత, బాలురను సంరక్షణ చేయుట శాస్త్ర సమ్మతము. ఆ సంవత్సరములలో మృతి నొందు బాలురు తల్లిదండ్రుల దోషము చేతను, బాలారిష్ట దోషములచే మృత్యువు వాత పడుదురని శాస్త్ర నిర్దేశితము.

8, 10 అధిపతులు ఇరువురు, ఆయుః కారకుడగు శని ముగ్గురు కేంద్ర కోణ లాభములందున్న జాతకుడు కీర్తివంతుడై దీర్ఘాయువును, సౌఖ్యమును పొందగలడు. చంద్రలగ్నాత్తు గాని, లగ్న లగ్నాత్తు గాని, 8 యింట గురు, శుక్రులు మాత్రమే వున్న అట్టి జాతకుడు నిండు నూరేళ్ళు జీవించును. చంద్ర, లగ్నాధిపతి గాని, లగ్నాధిపతి కాని స్వక్షేత్రమందున్నను శుభ వీక్షణలు కలిగివున్నను లగ్న అష్టమాధి పతులు కేంద్ర కోణములందున్న

యోగ్యమగు భార్య, సత్ పుత్రులు కలిగి బహు కాలము జీవించగలడు అష్టమ మందు రవి వున్న యెడల చంచల స్వభావి, రోషము కలవారు, అల్ప ధనము, అల్ప పుత్రులు, సౌఖ్య హీనత, దృష్టి దోషయుతుడుగా వుండుటకు అస్పదము కలదు. అష్టమమందు చంద్రుడు వున్న బాలారిష్టములు గలవాడు, ప్రభుత్వము వల్ల, దొంగల వల్ల, శత్రువుల వల్ల పీడింప బడువాడు, మాతృసౌఖ్యము లేక చంచల స్వభావియై జీవించగలడు. 8 యింట కుజుడు వున్న నేత్రరోగి, సౌందర్య హీనుడు, నీచ వృత్తి, మందు బుద్ధి గలిగి, మూల రోగముచే బాధల నొందును ఒక సమయము ద్వికళత్రము సహ కలుగుటకు ఆస్పదము కలదు.

అష్టమమున బుధుడు వున్న భూత వైద్యుడు, అల్ప విద్యావంతుడు, వ్యాపారముచే జీవనము చేయువాడు, కోప స్వభావిగా వుండి జీవనమును అతి ప్రయాసచే గడుపువాడుగా వుండగలడు. అష్టమమున గురుడు వున్న అనాయాస మరణమును పొందువాడు, తీర్థయాత్రలు చేయువాడు, నిరంతర దరిద్రుడు, వినయ హీనుడు, సేవక జీవనముచే జీవించు వాడుగా వుండును. అష్టమమునందు శుక్రుడు వున్న ధర్మమునందు ఆసక్తి గల వాడు, సామాన్య భాగ్యవంతుడు, అల్ప రతి గలవాడు, ప్రభుత్వ ఉద్యోగిగా వుండుటకు ఆస్పదము గలవాడుగా వుండును. అష్టమమందు శని ఉన్న యెడల దీర్ఘాయుర్దాయము గలవాడు, బాల్య దశయందు సౌఖ్యము లేక మధ్యమ, అంత్య దశలయందు సుఖ జీవి, జీవిత మందు కష్టజీవిగా మనగలడు. రాహు జాతకుడు రోగములచేత బాధపడు వాడు నీచ స్వభావము కలిగి అన్యాయ ముగా ధన సంపాదన చేయు జూదరిగను, సౌఖ్య హీనుడై జీవనము చేయును. అష్టమ కేతు జాతకుడు, మాతా పితృ సౌఖ్యము లేని వాడు, దైవ, బ్రాహ్మణ ధూషితుడు, వంచితుడు, శరీర సౌఖ్యత లేక దుఃఖ భూయిష్టమైన జీవనము గడుపు వాడుగా వుండును.

అష్టమాధిపతి లగ్నమందుగాని, సప్త మందు గాని వున్న భార్య యందు భయము, వ్రణ, రోగ భాధితుడు, దైవ భక్తి తక్కువగా గల వాడుగ మనగలడు అష్టమాధిపతి ద్వితీయ, తృతీయము లందున్న యెడల స్వల్ప ధనము గలవాడు, బలహీనుడై జీవించును. అష్టమాధిపతి చతుర్థ, దశమములందున్న యెడల జాతకుడు యోగి, బంధు ద్వేషి తల్లి దండ్రులు త్వరలో స్వర్గస్థులు అగుటకు ఆస్పదము సహ కలిగి వుండును. అష్టమాధిపతి పంచమ, నవములందున్న గాని, లాభమందున్న గాని వున్న అస్థిరత్వ మనస్కులు, వంశవృద్ధి లేక గృహమందు ధనము సహ తక్కువగా వుండి జీవనము చేయును. అష్టమాధిపతి అష్టమమందే వున్న జాతకుడు జూదరి, వ్యతిరేక వాదము చేయు మొండివాడుగను, గురు నింద చేయు వాడుగను, కామిష్టిగల భార్య సహ వుండును.

ముఖ్యముగా లగ్నాధిపతిని, అష్టమాధి పతిని, రాజ్యాధిపతిని, ఆయుఃకారకుడగు శనిని, వారి యొక్క బలాబలమును, దృక్కులను, నిశిత దృష్టిచే పరిశీలించి ఆయుఃవిచారణ చేసిన సత్ ఫలితములను తప్పక సాధించ వచ్చు.

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.6.1995 నుండి 20.7.1995 వరకు)

ఆదాయపు పన్ను చెల్లించు అసెసీలు నాలుగు వర్గాలుగా చట్టములో పేర్కొన బడినారు అందులో మూడవ వర్గము "ఇతరులు" జీతములు, ఇంటి బాడుగలు వగైరా మాత్రమే ఆదాయముగా కల అసెసీలు ఈ ఇతరుల వర్గమునకు చెందుతారు మీరు ఈ ఇతరుల వర్గమునకు చెందే అసెసీలా? అయితే మీరు మీ ఆదాయపు పన్ను రిటర్న్లను మీకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఈ (జూన్) నెల 30వ తేదీయే చివరిది సవరించబడిన ఆదాయపు పన్ను చట్టము ప్రకారము పై జూన్ 30వ తేదీకి లోగా రిటర్న్లను దాఖలు చేయని వారు సదరు రిటర్న్లను దాఖలు చేయుటకు వ్యవధిని కోరుటకు గతములో లాగా ఇప్పుడు అవకాశం లేదు ఈ విషయాన్ని సదా మీరు గుర్తుంచుకోవడము అవసరము

1994-95 లలో మీరు ఎవరికైనా రూ 20,000/-లకు మించి బహుమతి (గిఫ్టు) ఇచ్చారా? అయితే మీరు ఈ జూన్ నెల 30వ తారీఖులోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన అధికారికి మీ గిఫ్టు ట్యాక్సు రిటర్న్లను తప్పక పంపాలి మరువవద్దు

సి.యస్.టి. ఫారాన్ని రెండు కాపీలుగా అందులో చూపిన మేరకు కట్టవలసిన అమ్మకం పన్నును చెల్లించిన డిమాండు డ్రాఫ్టుతో మీకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి జూలై 15వ తేదీకి లోగా పంపాల్సి ఉంది ఈ విషయాన్ని గుర్తుంచుకోండి.

మీరు పంపవలసిన A-2 రిటర్న్లను చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు జూలై నెల 20వ తేదీయే చివరిది మీరు పంపు ఆ A-2 రిటర్న్లను చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్న్లను చెక్కుతోబాటు పంపుటను జూలై నెల 15వ తేదీ లోగా చేయాలి

## గత మే సంచికకు సవరణ

**గత మే (1995) సంచిక వైశ్య ప్రబోధిని 33వ పుటలో గల 'చరిత్ర ప్రసిద్ధుడు.. గుప్త' అను వ్యాసములోని 7వ పంక్తి లోని 1921 అనుదాన్ని 1927 అని సవరించుకో గోరుచున్నాము.**

PHILIVISION CT 2070



PHILIVISION

Colour TVs



PHILIPS

Authorised PHILIPS Dealers



Office : 6044

Resi : 6863

VASAVI GENERAL TRADERS

GUNTAKAL.

PIN-515 801

## చక్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.) పూర్తిగ బాగైనది.



డా.గ్రంథే రఘురామ గుప్త

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంథే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా – 523 316.)

ఆర్యా !

నమస్సులు. నేను 20 సం||లుగ బి.పి. తోను 10 సం||లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చ్ సెంటర్‌కు 3 పర్యాయములున్ను, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని. కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కలిగినది. ఇప్పటికి ఒక సం||నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అపుడపుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధ వైద్యమునకు నా నమస్కారములు.



డా. జి.వెంకట ప్రసాద్

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిఫల్ కౌన్సిలర్

శరీరంలో శక్తికి, సంసారంలో అనురక్తికి ! ప్రతిరోజు 2 క్యాప్సూల్స్ పాలతో సేవించండి.

# ఒజోమెన్ క్యాప్సూల్స్






* ఆనందంగా, ఆరోగ్యంగా జీవించటం మీకిష్టమైతే
* మీ శ్రీమతిని మరింతగా ప్రేమించటం మీ కోరికైతే
* తరిగిపోయిన యవ్వనశక్తి మీకు కావాలంటే
* సుఖమయ దాంపత్య జీవితం మీ ధ్యేయమైతే

**ఇపుడు మీకు కావలసినది ఒజోమెన్ క్యాప్సూల్స్**
ఇది ప్రకృతి ప్రసాదిత వనమూలికలు మరియు ఖనిజముల మిశ్రమము. ఎంతకాలమైనను వాడవచ్చును. వ్యసనం లేదు. ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు.

ఇంకా వివరములు తెలుసుకొనగోరినవారు ఈక్రింది అడ్రసుకు ఒక పోస్టుకార్డు వ్రాసిన చాలు ఎంతో సమాచారం తెలుస్తుంది.

మార్కెట్ చేయువారు
**స్టెర్లింగ్ రెమిడీస్**
PO బాక్సు నెం : 194,
విజయవాడ - 520 001

పేరొందిన అన్ని మందుల షాపులలో లభ్యం



Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 45025.